సంపుటము 4] జూలై 1917 [సంచిక 1

# బాలమిత్ర



## ఈగ, సాలెపురుగు

సాలె.—“ ఈగమ్మా, ఈగమ్మా ఇంట్లోకి వస్తావా?
ఈ యింటి చిత్రాలు ఎచటైనా చూచావా?
సుడిమేడ మెట్లెక్కి చుట్టు తిరుగుచు వచ్చి
సొగసైన గదిలోని చోద్యాలు చూస్తావా?”

ఈగ.—“ అబ్బబ్బ నేరాను! అబ్బబ్బ నేరాను!
సాలెపురుగులమేడ చాలా చిత్రపుమేడ
ఎగిరీ వెళ్లినవారు దిగలేరు ఈమేడ
మేడ ఎక్కడమేల? మెట్లు ఎక్కడమేల?
చావు కోరడమేల? నీవు పిలువడమేల?”

సాలె.—“అయ్యయ్యో, నీకెంత అలసటలేదమ్మా,
పగలంతా నీవట్లు ఎగరలేవమ్మా,
పట్టె మంచము పరుపు పరచి ఉంచాను
చుట్టు దోమతెరలు కట్టి ఉంచాను
గడియసేపు నీవు పడుకొనిపోరాదె?”
ఈగ.—“అబ్బబ్బ నేరాను! అబ్బబ్బ నేరాను!
సాలెపురుగుల పంచ చావు కోరిన పంచ
నిమిషమైనా గాని నిద్రించి ఉంటేను
మొద్దునిద్దుర బోయి పెద్దనిద్దుర బోయి
తెలివి తప్పిపోయి దిగలేరు నీ మేడ”
సాలె.—“ఎంత వెర్రీదానవు, ఎంత పిచ్చిదానవు,
ఎంత జడ్డిదానవు ఈగమ్మా నీవు
నీయందు నాకున్న నిజమైన ప్రేమచే
రమ్మాని పిలిచాను నమ్మావెందుచే
కమ్మాని ఫలహారం గదిలోను దాచాను
ఆరగించి నీవు పోరాదె ఈగమ్మా”
ఈగ.—“అబ్బబ్బ నేరాను! అబ్బబ్బ నేరాను!
నీ యింటి చిత్రాలు నీ యింటి ఫలహారం
ఇదివరకె ఎరుగుదును ఇంత ప్రేమ నీకు
నాయందు నీకేల నన్ను పిలువడమేల?”

సాలెపురుగు ఆట సాగింది కాదు.
ఎంత పిలిచిన ఈగ ఇంట్లోకి రాదు.

దానవు, ఎంత మంచి దానవు,
ద్దుల మూటవు ఈగమ్మా నీవు
నగనిగ లాడేటి ధగధగ మెరిసేటి
నీ కండ్లు వజ్రాలె లేకుంటె రత్నాలె
తళతళ లాడేటి పెళపెళ లాడేటి
రెక్కలు గల నీవు చక్కని దానవు
ఇంత చక్కని పక్షి ఎక్కడ గనలేదు
ఇంట్లోకి రావమ్మా ఈగమ్మా నీవూ ”

పొగడి వర్ణిస్తే ఈగ పొంగి పోయింది
దొంగ మాటకు ఈగ లొంగిపోయింది
సాలెపురుగు కార్యం సాధింప గలిగింది
తనవంటి తళతళలు తనకంటి జిగజిగలు
తన రెక్క లందంబు తలచుకొంటూ తాను
పొంగిపోతూ తాను చెంగు చెంగున తాను
సాలెపురుగుపంచ చావుకోరిన పంచ
వ్రాలింది ఈగమ్మా వ్రాలీ వ్రాలంగానే
మరియేది ఈగమ్మా మరియెచట ఉన్నావు?
పొగడి వర్ణిస్తే నీవు పొంగి ఉన్నావా?
దొంగమాటల కీవు లొంగి ఉన్నావా?
ద్రోహచింతకు నీవు దొరికి ఉన్నావా?
సాలెపురుగూ నోట చచ్చి ఉన్నావా?

## ఫలితార్థము

ఈ కథను చదివెడు పిల్లలారా, మీరు బుద్ధిహీనమైన యిచ్చకపు మాటల కెన్నడును చెవియొగ్గకుడి. దుష్టమం

త్రుల యాలోచనలకు మీ హృదం
చెవియొగ్గకుడి, వారిని చూడకుడి. "సా
కథవలన యిచ్చకపు మాటలను నమ్మువారు చెడు
గ్రహించి బుద్ధి తెచ్చుకొనుడ.

గిడుగు వెంకట సీతాపతి

---

# భూతదయాళుత్వము

రష్యాదేశస్థుడగు నొక గ్రంథకర్త తన చిన్నతనమందు తండ్రిగారితో పిట్టలవేటకు వెళ్లెను. అప్పు డతనికి పది యేండ్లు. దారిలో ఎండినగడ్డిగల బీడులోపడి నడచిపోవు చుండగా అడవికోడివంటి యొకపిట్ట బుఱ్ఱుమని యెగరగా చూచి యీ బాలుడు తన చేతనున్న చిన్న తుపాకితో దాని కాల్చెను. అది రెక్కవిరిగి తన కాళ్లయొద్ద నేపడి తిరిగిలేచి దగ్గరనున్న పొదలోని గూటియొద్దకుబోయి గూటిలోనున్న పిల్లలకేమో హాని వచ్చునని తన రెక్కలతో వాటినికప్పి జాలిపుట్టించు చూపుతో ఇతనివైపుచూచు ప్రాణము విడచెను. అదిచూచి యీ బాలుడు తన తండ్రితో "నాయనా! ఎంత పని చేసితిని!" అని భయముతోను జాలితోను అనగా ఆతండ్రి, "సెబాస్! మొదటి తడవకు భేషైనపని చేసినావు. ముందుకు మంచి వేటకాడవౌదువు" అని మెచ్చు



కొనెను. "లేదు, లేదు, ఇక నెన్నటికిని జీవజంతువును దేనిని చంపలేను. ఇది వినోదమైతే యిటువంటి వినోదము నా కక్కరలేదు. చావుకంటే జీవమే సుందరమైనది. ప్రాణము నేనియ్యలేను గనుక ప్రాణమును తీయుట నాకు తగదు" అని తండ్రితో అనెను. కాబట్టి జంతుహింస జంతువధ చేయుటకంటె, జంతువుల ప్రేమించి వాని యభ్యాసములను చేష్టలను పరీక్షించి వాటివల్ల నేర్చుకొనగల జ్ఞానమును పొందుటయే అతి శ్రేష్ఠమని యెరుంగవలయును.

---

## పొగాకు

పొగాకునందు విషమున్నదా?

భయంకరమైన విషముగలదు. దానిపేరు నికోటైన్. ఒక ధాన్యపుగింజ ఎత్తులో $\frac{1}{15}$ వంతు మనుష్యుని చంపినది.



అమెరికాలోని ఒక గొప్ప వైద్యుడీ ప్రయోగమును జేసి చూచెను. సాధారణమైన సిగరెట్టులో పెట్టునంత పొగాకును కొంచెము నీటిలో నానవేసి ఆ రసమును పిచికారి ద్వారా మంచిబలమైన పిల్లి శరీరములో కెక్కించెను. కొన్ని నిమిషములలో పిల్లి గడగడ వణకి, శరీరమంతయు గట్టిపడి, ఇరువై నిమిషములలో, సంధిగ్రమ్మి చనిపోయెను. ఎంత భయంకరము! పిల్లికి తొమ్మిది ప్రాణములనియు, చచ్చుటకు చాలసేపు పట్టుననియు చెప్పెదరుగదా, పొగాగెంత పనిజేసినదో చూడుడు.

ఆ విషము శరీరములో ప్రవేశించునా?

పొగాకు చుట్టలు త్రాగితే నికోటైను విషము శరీరమున కెక్కదందురు. ఇది శుద్ధ అబద్ధము. చుట్టలుగాని, సిగరెట్లుగాని, బీడీలుగాని, సొంగలుగాని, అన్నియును విషమును లోనికి వదలుచున్నవి. కలుగు కీడు, ఉపయోగించు పొగాకు శ్రేష్ఠతనుబట్టియు, పొగ ఎంతలోనికి

ఫిల్టురో దానినిబట్టియు ఉండును. నోటినుండి పొగను ఒక తెల్లనిబట్టపై ఊదినయెడల బట్టపై ఒక మరక యేర్పడును. ఆ పొగను మ్రింగి మరల బైటకు రానిచ్చినయెడల అట్టిమచ్చ బట్టపై పడదు. ఆ విషపు అంకురములు తలలోను, శరీరములోను ఆగినవి.

ఈ విషమువలన నేమి కలుగును?

1. నోరు, గొంతుక, ముక్కు సంబంధ జబ్బు లేర్పడును.

2. కంటిచూపు తగ్గును. త్రాగువాడుక తగ్గిన చూపు హెచ్చును.

3. మెదటి శక్తిని మందపరచి, జ్ఞాపకము తగ్గించును.

4. మంచివాసనలజూచు శక్తిని పాడుజేయును.

5. నాడుల బలమును తగ్గించి, నిద్రలేకుండుట, చిరాకును గల్గించును. చేతులకు వణుకురోగము పుట్టును. అట్టివారు సరిగా గీతలు గీయజాలరు.

6. మిగుల సాధారణ జబ్బు, ఊపిరితిత్తులను చెరచును. అందువలన పందెములకు సిద్ధపడువారిని పొగాకు త్రాగనియ్యరు.

7. అన్నిటికంటె హానికరమగునది, "గుండెజబ్బు." నికోటైన్ జేరినందున గుండె బహువేగముగా గొట్టుకొనును.

మంచి ఆరోగ్యమునందున్న పదుచువాడొకడు డాక్టరును చూచి, ఈ దినమున 20 చుట్టలను త్రాగితినని బడాయి గొట్టెను. "దానివలని ఫలితము నీకు కనుబడలేదా?" అని డాక్టరడిగెను. "లేదు, కొంచెమైనాలేదు."—డాక్టరా మనుష్యుని నాడిని చూచి, "నీగుండె నిమిషమునకు 108 సారులు కొట్టుకొనుచున్నది. ఆచొప్పున గంటకు 2160 సారులు ఎక్కువ కొట్టుకొనుచున్నది. ఆలాగు కొట్టుకొన్న యెడల ఎక్కువ కాలమువరకు గుండె పనిజేయుజాలదు." అని చెప్పెను.

### సిగరెట్లేమి జేయును?

పొగాకువాడుక లన్నిటిలో సిగరేటంత హానికరమగునది మరొకటిలేదు. దానిలో 5 రకముల విషములున్నవి. కాగితములో ఆర్సెనిక్ అను విషమును, పొగాకులో నికోటైన్ యును, పొగాకు చెడకుండునట్లు పెట్టు సురేకారమును, తల తిరుగుటకు వేయు నల్లమందును, మంచివాసన గొట్టుటకు వేయు మరియొకతరహా నూనెయందుండు విషమును సిగరెట్టునందున్నవి. పిచ్చిపట్టుటకు ముఖ్యకారణము సిగరెట్టని ఒక డాక్టరు చెప్పినమాట వింతకాదు.

చిన్నపిల్లలకు సిగరెట్టు పరమశత్రువు, అది వారిని సరిగా నెదుగనియ్యదు, సిగరెట్టువలన నీతిమాలినబుద్ధులు పుట్టును. ఈ వాడుక మరీ లోతుకుదింపును, దురభ్యాసము లలవడును.

పొగాకు త్రాగువా రేమిచేయవలెను?

మిక్కిలి శ్రేష్ఠమైనపద్ధతి, ఆ వాడుకను మానుటయే. ఎందువలన?

1. అది అమానుషము.
2. ,, అనారోగ్యకరము.
3. ,, అపవిత్రము.
4. ,, అస్వాభావికము.
5. ,, పిచ్చితనము.
6. ,, బానిసలగా చేయును.

కం. చుట్ట నొకసారి నోటను
పెట్టినయట్లైన నదియు ♦ పంతముతోడన్
"పట్టుము నన్నిక" నని నిను
పెట్టును కష్టములుగాన ♦ పట్టకుదానిన్.

# ప్రకృతి పాఠములు

35 వ-పాఠము

## ఎముకలు

(గతసంచిక శేషము)

పెద్దవారి యెముకలు, బిడ్డల ఎముకలకంటె పెళుసు. బిడ్డల ఎముకలు పెళుసుగా నున్నయెడల వారివి



ఎన్నోమారులు విరుగుననుట కేసందేహమును లేదు. పిల్లల వలె పెద్దలును అజాగ్రత్తగా నుండునెడల, వారి యెముకలు విరిగి ప్రతి యింటిలోను కుంటివారనేకు లుందురు. బిడ్డలు పడినప్పుడు వారితలలు పగులకుండునట్లు మంచి యేర్పాటొకటిగలదు. పెద్దవారి మెడలోని యెముకలు గట్టిగా కూర్పబడి ఒక్క యెముకవలెనే యున్నవి. గాని బిడ్డలలో అవి విడివిడిగానున్నవి. మండపై చెయిపెట్టి చూచినయెడల అపి దూరముగా నున్నట్లు జూడవచ్చును. బిడ్డ పడినప్పుడు తలకు దెబ్బతగిలినయెడల ఈ మెత్తని యెముకలు వత్తుకొని పోవునేగాని అవి పగులవు.

దంతములు ఎముకలవంటివే గాని ఒక విషయములో మాత్రము భేదించియున్నవి. ఎముకలు శరీరముతోపాటు పెరుగునుగాని దంతములు మొదట ఎంత యుండునో పెద్ద

వారై వృద్ధాప్యము వచ్చినప్పుడును అంతేయుండును. పన్ను చిగుళ్లలోనుండి బైటకు వచ్చునప్పుడు ఎంత యుండునో తరువాతను అంతేయుండును. ఎందువలన? పంటియొక్క పైభాగము బహుగట్టిది. అది చేయవలసినపని రాపిడితో గూడినది గాన యింత గట్టిగానుండును. గనుక ఇకను అది పెరుగదు. రక్తము దానిలోకి పోగలదు గాని అది పెరుగనేరదు. గనుకనే ప్రతివారికి రెండు మారులు పండ్లువచ్చును. మొదటి సారివచ్చినవి పెద్దవారైన పిమ్మట పనికిరావు గాన సుమారు ఏడవ సంవత్సరమున అవి ఊడిపోయి మంచి గట్టివివచ్చును. ఇవి పెద్దవిమాత్రము గాక సంఖ్యయందును ఎక్కువగా నుండును. దవుడల యందుండిన స్థలమునంతటిని యాక్రమించుకొనును.

మన యెముకలన్నియు శరీరములోపల గలవు. అవి కండరములతోను, స్నాయువులతోను, బంధనములతోను కప్పబడి యున్నవి. వీటన్నిటిపైన చర్మమున్నది. గాని కొన్ని జంతువుల యెముకలు శరీరమునకు బైటనుండును. ఎండ్రకాయలు, రొయ్యలకు ఎముకపైన ఉండును. లోపలనున్న మెత్తని యింద్రియములకు దెబ్బతగులకుండ నిది వానిని రక్షకముగా నుండును. ఇంక అనేక చిన్నపురుగులపైనుండు గట్టి పదార్థముల ఎముకవంటివై యున్నవి.

ఎంద్రకాయలు రొయ్యలు మొదలగువాని పైకప్పు ప్రతి సంవత్సరము మారుచుండును. ఇదివరకున్నవి చిన్నవి గాన అవి పెరిగినప్పుడు చాలకుండును. ఆ పురుగు ఏదైన యేకాంతపు ప్రదేశములకేగి ఆ పైకప్పును దీసివేసికొనుటకు యత్నించును. అది బహు కష్టమైనపని. ఒక్కొక్కప్పుడు దాని ప్రాణము పోవచ్చును. అది వచ్చినపిదప నాలుగైదుదినములు దేనికి కనుపడకుండ ఎచ్చటనైనను దాగి తరువాత నిర్భయముగాను, ధైర్యముతోను మేతకొరకు తిరుగులాడుచుండును.

---

# బైబిలు పిల్లలు

## దావీదు, యోనాతాను

బాల మిత్రులారా! మన మిప్పటికి చాలమంది బైబిలు పిల్లలను గురించి చదివియున్నాము. ఇప్పుడు బైబిలునందలి ఇద్దరు స్నేహితుల గురించి చదువుదము. వారెవరో మీ రెరుగుదురా? వారు దావీదు, యోనాతానులను చిన్నవారు. దావీదు, యెష్షయనువాని కొమరుడు. యోనాతాను రాజైన సౌలుయొక్క కొమరుడు. దావీదు చిన్నప్పుడు గొర్రెలమందల కాయువాడు. అట్లు గొర్రెల మేపు

చున్నప్పుడు ప్రవక్తయగు సమూయేలుచే, యోనాతాను తండ్రియగు సౌలునకు బదులు రాజుగా నభిషేకించ బడెను. తండ్రికి అనంతరము రాజగునను అసూయ ఏమాత్రము యోనాతానునకు లేవాయెను. సౌలు, దావీదు రాజగునని విని అతని చంపుటకు అనేక పర్యాయములు ప్రయత్నించెను. తండ్రి తన ప్రాణస్నేహితుడగు దావీదును చంప యత్నించిన యత్నముల స్నేహితునకు తెలిపి యతని తప్పించువాడు. వీరి స్నేహము బహు పవిత్రమైనది. నిజమైన స్నేహమునకుండవలసిన లక్షణములు వీరి స్నేహములో నుండెను. ఆ లక్షణము లెవ్వియో, మీ రెరుగుదురా? మీకు చేయుస్నేహములు మంచివేనా?

నిజమైన స్నేహితుడు తన్ను సహితము మరచి తన స్నేహితుని అక్కరల నెక్కువగా తీసుకొని, కష్టకాలమున నాతని యక్కరల తన ప్రాణమునైనను పెట్టితీర్చును. మన ప్రభువైన యేసుస్వామి "తన స్నేహితులకొరకు తన ప్రాణముపెట్టువానికంటె, ఎక్కువైన ప్రేమగలవా డెవడు" అని చెప్పెను. గనుక నిజమైన స్నేహితు డెంతగా ప్రేమించునో పై వాక్యమునుబట్టి తెలుసుకొనవచ్చును. దొంగ స్నేహితులు తన స్వమేలుగోరి నిజస్నేహితులవలె కన్పింతురు. కష్టములు వచ్చినప్పుడు స్నేహితులకు సలహాల

నిచ్చుటగాని, తగుసహాయముల జేయుటగాని సున్న. ఇటువంటి స్నేహితులు నిజమునకు గొప్ప శత్రువులనుట శ్రేయస్కరము.

మంచి స్నేహితుడు తన స్నేహితు డొక తప్పుజేసిన వానికి న్యాయముగా తప్పునుగురించి మోమాటము లేకుండ తెలుపును. చేయరానిపనుల చేయకుండ ఉండునట్లును, సత్క్రియలందు అభివృద్ధి జెందునట్లును సహాయపడుదురు. వెయ్యేల? నిజస్నేహితులు తమ స్నేహితుల కష్ట నష్ట సుఖ సంతోషములలో పాలుపొందుదురు. దావీదు, యోనాతాను స్నేహము ఇటువంటిదే. మీయొక్క స్నేహము లెట్టివి? చెడుగును కల్గించునవా? అయితే అట్టి స్నేహముల మానుడు. కొద్దికాల మట్టి స్నేహములవలన సంతసించినను, కలకాలము మనస్సుకలత జెంది నెమ్మదిలేకుండ యుండవలసి వచ్చును. కాన మంచి స్నేహములనే సంపాదించుకొనుడు.

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

ప్రతి నెలారంభమున మీరు పంపు టపాను చదువుట వలన నేనును నా స్నేహితులును చాలా సంతోషము




పొందినాము. మా స్కూలులో 70 మంది పిల్లలము విద్య నేర్చుకొనుచున్నాము. ప్రతి ఉదయమున బడికి రాగానే మా మేస్టరుగారు చక్కని కీర్తనలు పాడించి ప్రార్థన చేతురు. పిమ్మట తరగతులకు వెళ్లుదుము. 10 ఆజ్ఞలును ప్రభువు ప్రార్థన కొన్ని కీర్తనలు నేర్చుకొంటిమి. ఈ కథలు నన్ను చెడ్డపనులు చేయకుండ బుద్ధిచెప్పుచున్నవి. మేము క్రిస్మస్ పండుగు చేసుకున్నాము. ఆ పండుగ సమయములో మా హెడ్మాష్టరుగారు నేర్పిన సంభాషణలు, ఆటలు, పాటలు, నాటకములు ప్రదర్శించి నేనును నా స్నేహితులును మంచి బహుమతులను అందుకొంటిమి. ఆ దినమున మీలో అనేకులు కూడా మంచియినాములు పొందినారని అనుకొంటున్నాము.

అయితే యీ బహుమతులవలన వచ్చేసంతోషము ఒకటి రెండు రోజులందేగాని యేసుక్రీస్తు అనే బహుమతిని యెవరు పొందుదురో వారికి యెల్లప్పుడు సంతోషముండునని నేర్చుకున్నాము. అది నిజమేనా? మా స్కూలుయొక్క అభివృద్ధి కొరకు ప్రార్థించండి. సలాములు.

మా స్నేహితుడు

దున్న అప్పలస్వామి

టెక్కలి

గంజాము జిల్లా

C. L. S. PRESS, MADRAS—1917